సంపుటము ౯ డిశంబరు 1935 సంచిక ౯

# గ్రంథాలయ సర్వస్వము

బెజవాడ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ పక్షమున ప్రకటింపబడు సచిత్ర మాసపత్రిక.

సంపాదకుడు : అయ్యంకి వేంకటరమణయ్య



గ్రంథాలయసేవక : మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారి

## షష్టిపూర్తి మహోత్సవ సంచిక

వీరి షష్టిపూర్తి మహోత్సవము 1935 సం. నవంబరు 23, 24, 25, 26, తేదీలయందు విశాఖపట్నమున మహారాజ వైభవోపేతముగా జరిగినది.

వార్షికమూల్యము : సభ్యులకు రు 3—0—0

# వినతిపత్రము

## మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి పాదపద్మములసన్నిధికి

కవివరా! గ్రంథాలయసేవకాగ్రణీ!

తమ షష్టిపూర్తిసందర్భములో నేడు జరుగుచున్న ఈమహోత్సవమున ఆంధ్రదేశగ్రంథాలయసంఘపక్షమున మేము సభక్తికప్రణామాంజలులతో తమకీ వినతిపత్రమును సమర్పించుకొనుచున్నాము.

ముప్పది నలువది సంవత్సరములకుపూర్వము గ్రంథప్రచారముగాని పత్రికాబాహుళ్యముగాని లేని ఆరోజులలో ప్రప్రథమమున జనసామాన్యమునకు విజ్ఞానజ్యోతి వెలిగించుచు గ్రంథాలయప్రచారము జరిపి తాము గ్రంథాలయోద్యమమునకు అంకురార్పణము గావించినారు. పిమ్మట మరి ఎన్నెన్ని ఉద్యమములను చేపట్టినను ప్రారంభించిన ఈమహాకార్యమును మాత్రము మరువక నేటివరకుకూడ దీని నభివృద్ధిపరచుచు తామనల్పముగ దేశారాధన మొనరించినారు. ఇట్లు మీరు చూపిన మార్గమునే అనుసరించుచు మేము ఓపినంతవరకు గ్రంథాలయోద్యమమూలమున దేశసేవకావించుచున్నాము.

ఒక్క గ్రంథాలయోద్యమమే కాకుండ తాము చేపట్టిన సంఖ్యాతీతములైన ప్రజోపయోగికార్యము లన్నింటిని జయప్రదముగా కొనసాగించి యావదాంధ్రప్రపంచముయొక్క కృతజ్ఞతకును మన్ననకును తాము పాత్రులయినారు. తాము ప్రదర్శించిన అమితోత్సాహము, త్యాగశక్తి, కార్యదీక్ష మాకు నిరంతరము నూతనపటుత్వమును చేకూర్చి కార్యనిర్వహణకు పురికొల్పుచున్నవి. ఈనాడు మేము కార్యరంగమున అవలంబించుచున్న విధానములన్నిటియందును మీ ఒరవడి విస్పష్టముగా కనుపింపక పోదు. ఉజ్జ్వలజ్ఞాన దీపికలు ధరించి మీరు ముందు దారిదీయుచుండ, అవేలమైన ఉత్సాహముతో మేము తమ అడుగుజాడలను అనుసరించుచు ఉండెదము. ఇట్లే ఇకముందుకూడ అనేక సంవత్సరములు తమ తేజస్సు మమ్ము దిద్ది తీర్చుటకు పరమేశ్వరుడు మీకు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధులు చేకూర్చుగాక!!

ఆంధ్రదేశగ్రంథాలయసంఘసభ్యులు

---

పశ్చిమ గోదావరిజిల్లా విద్యాశాఖాధికారి గ్రంథాలయములలో ఉండకూడదన్న పుస్తకముల జాబితా.

(డాక్టరు తేతలి సత్యనారాయణ, తాలూకాగ్రంథాలయసంఘకార్యదర్శి.)

240 సాక్షి
241 ,,
242 ,,
243 ,,
244 ,,
245 ,,
312 ఇంగ్లీషువారి సంసారపద్ధతులు
361 అకాలీలసత్యాగ్రహము
384 గాంధీమహాత్మునిచరిత్ర (గోవిందాచారి.)
385 ,, (మా. సత్యనారాయణ.)
387 మహాదేవ గోవింద రేనడే
400 ఆత్మక[illegible] I (మహాత్మా గాంధి)
401 [illegible] II ,,
402 కోయలచరిత్ర

---

# నీటిమీద గ్రంథాలయము, క్రొత్తవింత

సంచారగ్రంథాలయము, పెదవడ్లపూడి.

25-10-35 తేదిన ఉ॥ 7 గంటలకు, "ఆర్య బాలసమాజభవనమున" సరస్వతీపూజ జరిగిన పిమ్మట సేవాశ్రమవాణీమందిరసంచార గ్రంథాలయపేటిక చక్కగా అలంకరింపబడి మేళతాళములతో గ్రామవీథులవెంట నూరేగుచు కాలువ వద్దకు పెద్ద జన సమూహముతో తీసికొనిపోబడెను. ఇందు ఫిర్కాయందలి చుట్టుపట్టుల గ్రామములలోని పలువురు గ్రంథాలయోద్యమాభిమానులు, సేవాశ్రమవాణీ మందిరసభ్యులు పాల్గొనిరి. కాలువయొద్దున బోటు రేవుకడ పెద్దసభ కూడెను.

బ్రహ్మశ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రిగారి ప్రార్థనానంతరము గుంటూరు మండల గ్రంథాలయ సంఘాధ్యక్షులగు శ్రీయుత శరణు రామస్వామి చౌదరిగారు సభ కధ్యక్షత వహింప, వాణీమందిరకార్యదర్శియగు శ్రీయుత పాతూరి నాగభూషణంగారు తాము పడవలో స్థాపింపబోవుచున్న సంచార గ్రంథాలయస్థాపనోద్దేశములను, ఇందుకు పూనుకొనక పూర్వము తమకు గలిగిన యనుభవవిశేషములను పూర్తిగా నివేదించిరి. అంతట అధ్యక్షులు తమ ప్రారంభోపన్యాసమున నీ క్రింది ముఖ్యవిషయములను జెప్పిరి:—

అధ్యక్షుని ప్రసంగము:—ఈ సంచార గ్రంథాలయ పద్ధతి మన ఆంధ్రదేశమునకే గాక దక్షిణదేశమున కంతటికిని క్రొత్తది. ఈ జిల్లాలో ప్రశంసనీయముగ పనిచేయుచున్న సేవాశ్రమ వాణీమందిరమువారిని ఈ పూనికకై కొనియాడవలసియున్నది. గ్రంథాలయములు నేడు, మన దేశములో మంచియభివృద్ధిని గాంచుచున్నవి. ఇంకను చక్కని పెంపు వీనికి రాగలదు. అయినను అమెరికాదేశమం దీయుద్యమము మిక్కిలి మహోన్నతదశయం దున్నది. అచ్చటిపలువిధములగు విజ్ఞాన విషయములకు సంబంధించిన గ్రంథాలయము లేర్పడి ప్రజలకు మిక్కుటమగు జ్ఞానమును ప్రసాదించుచున్నవి. ఈయభివృద్ధి కంతటికిని 'కార్నిజీ' మహాశయు డచ్చటి గ్రంథాలయముల కొనర్చిన గొప్పధర్మములే పునాది. ఇందుకు ప్రభుత్వమువారియొక్కయు, దేశములోని విద్యావంతులయొక్కయు తోడ్పాటుసహితము గలదు. ఫ్రాన్సు, ఆస్ట్రియా, రష్యా మొదలగు స్వతంత్ర దేశములన్నిటను నేడీయుద్యమము ప్రజల కనేకవిధముల నుపకరించుచున్నది. మన దేశమునందు నిరక్షరకుక్షులగువారికి గ్రంథాలయములు చేయవలసిన సేవ యెంతయేని గలదు. ఒక్కబరోడా సంస్థానమునందు తప్ప మరియెక్కడ నీయుద్యమమున కంతగా ప్రభుత్వపుతోడ్పాటు కానరాదు. శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారు శాసనసభ్యులుగా నున్నకాలములో ఈయుద్యమావసరమును గ్రహించి యిందులకు ప్రభుత్వమువారు తోడ్పడుట యవసరమని కృషిచేయ,తత్ఫలితముగ నేటివరకుకంటనీరు తుడుచుటకో యన స్వల్పముగ మద్రాసు రాష్ట్రమునమాత్రము కొన్నిగ్రంథాలయములకు ప్రభుత్వమువారుగ్రాంటుల నిచ్చుచున్నారు. ఈ స్వల్పమొత్తమైనను బడ్జెటులో పమువచ్చినప్పుడు మినహాయింపులలో మొదట త్రోసివేయబడును." ఇంతేగాక యీయుద్యమము మన దేశములో వివిధప్రాంతములయందును యెట్లు పనిచేయుచున్నదియు, యిది మానవ కళ్యాణమునకు నెట్లు సహాయపడునదియు విపులముగ విశదీకరించిరి. శ్రీయుత రాయసం వేంకట శివుడుగారిని సభికుల కెరుకపరచుచు వారిని సంచారగ్రంథాలయముప్రారంభింప వలసినదిగా గోరిరి.

అంతట వేంకటశివుడుగారు సభికుల హర్షధ్వానములమధ్య లేచి సంచారగ్రంథాలయమును ప్రారంభము జేయుచు తమ సహజ మృదు మధుర శైలిని శ్రోతల నానందాబ్ధిలో ముంచిరి. నవీనముగ వెలువడుచున్న కొన్నిగ్రంథములు పత్రికలు నేవిధముగప్రస్తుతసంఘాభివృద్ధికి చెరుపుజేయుచున్నదిచెప్పినపుడు కంపించని సభికుడుండడని వ్రాయుటలో అతిశయోక్తి లేదు. వారియుపన్యాసము ప్రజలకును గ్రంథాలయసేవకులకును కూడ మిక్కిలి యుపయుక్తములగు సలహాలతో కూడుకొనియున్నది.

తరువాత గుంటూరు హిందూకళాశాలలో తెలుగుపండితులుగానున్న శ్రీయుత మందిలపర్తి ఉపేంద్రశర్మగారు వేదకాలమునుండియు భారతదేశమున గ్రంథాలయములు ప్రచారమునందున్నవనియు పురాణహరికథాకాలక్షేపములు, గోష్ఠులు, నాటకములు, తోలుబొమ్మలు వగైరాలమూలమున జనులలో జ్ఞానము వెదజల్లబడుచుండెడిదనియు, ఆధునికయుగమున విదేశములన్నింటను రేడియో, సినిమా మొదలగు సాధనములద్వారా ప్రజలలో విజ్ఞానము వెదజల్లబడుచున్నదనియు నీనాటి పద్ధతులతోపాటు మన పూర్వసాంప్రదాయములనుగూడ జోడించి ప్రజలలో గ్రంథాలయములు విజ్ఞాన వ్యాపనమును

చేయవలయుననియు మొదలుగాగల ముఖ్యమైన విషయములనుగురించి ముచ్చటించిరి.

అంతట కవివరేణ్యులగు శ్రీ బుచ్చిసుందర రామశాస్త్రిగారు ఈ సందర్భమునుగూర్చి కొన్ని పద్యములుజెప్పి సభికుల రంజింపజేసిరి.

ముగింపు:—అధ్యక్షుడు సభను ముగించుచు పూర్వకాలమందు రాజా మహేంద్రరాయలు గ్రంథాలయములకును గ్రంథభాండాగారముల కును దేవాలయముల కిచ్చినట్లు భూములను శాశ్వతదాన మొసంగియుండి రనియు అటులనే నేడు పెదపాలెంగ్రామవాసులు యిచ్చటనున్న సంస్థలకు శాశ్వతమగు వసతుల నేర్పాటుజేసి అవి చక్కగా నిర్వహింపబడునట్లు చూచుట వారి విధ్యుక్తధర్మమనియు, ఇచ్చటనున్న 'సేవాశ్రమ సేవకుల' వంటి యువకులు యీ సంస్థల కార్య నిర్వాహమునకై దొరకుట యీ గ్రామము యొక్క అదృష్టమనియు వీరికి భగవంతుడు ఆయురారోగ్యములనిచ్చి వీ రీ సంస్థలు నిర్విఘ్నముగా వానియుద్దేశముల నెరవేర్చునట్లు చేయుదురుగాక యని! ప్రార్థించుచుంటిననియు చెప్పిరి.

చివరకు 'వాణీమందిర' కార్యదర్శి అధ్యక్షుల కును, వేంకటశివుడుగారికిని, సభికులకును చుట్టు పట్టులనుండి వచ్చిన అతిథులకును యీ సంచార గ్రంథాలయ స్థాపన విషయమై తగు సలహాల నిచ్చిన వారికిని దానిని తమ పడవలో పెట్టుకొని నడుపుట కనుమతించిన బోటువారికిని, దీనికై యొక బీరువాను దానముచేసిన చినపాలెంవాస్తవ్యులగు వాశిరెడ్డి అన్నపూర్ణమ్మగారికిని, యే భగవానునికృపావిశేషముచేత యెట్టివిఘ్నములు లేకుండ యీ సత్కార్యము చక్కగా నెరవేరెనో అట్టి జగత్ప్రభునగు యీశ్వరునికి తమ హృదయపూర్వకకృతజ్ఞతాభివందనములు వెలిబుచ్చుటతో యీ సంచారగ్రంథాలయప్రారంభోత్సవకార్యక్రమము ముగిసెను.

---

# గ్రంథాలయ ప్రచారము

## నాయకులఉపన్యాసములు

విశాఖపట్టణమున కోటవార్డు ముస్లిము గ్రంథాలయమువారి యాజమాన్యముక్రింద మొన్నటి దినమున మహమ్మదీయ పాఠశాలాభవనములో గ్రంథాలయోద్యమప్రచారముకొరకొక బహిరంగసభజరిగినది. శ్రీ జయంతి వెంకటనారాయణ గారు(బరంపురము) అధ్యక్షతవహించిరి. ప్రారంభమున షేకు జన్నాసాహెబుగారును, కొండలరావు గారును ప్రార్థనసల్పిరి. బెజవాడనుండి విచ్చేసిన శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యగారును, శ్రీమతి అట్లూరి వేంకటసీతమ్మ, కోన వేంకట రాయశర్మ, జనాబు ఇసాక్ సాహెబు, పురిపండా అప్పలస్వామిగార్లును గ్రంథాలయోద్యమముగూర్చి ఉపన్యాసముల నొసగిరి.

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు ఉపన్యసించుచు నిట్లు నుడివిరి:—"అన్ని గ్రంథాలయములలోని గ్రంథాలయ పట్టిక నొకటి తయారు చేసి ఆ పట్టికను పట్నములలోని అన్ని గ్రంథాలయములలోను ఉంచడము అవసరము. ఆ కేంద్ర పట్టిక ననుసరించి పరస్పరము గ్రంథములు ఎరువు తెచ్చుకొనుట, పుస్తకములు పైనుండి కొని తెప్పించునపుడు కలిసి తెప్పించుకొనుట మంచిది. సాధారణముగ మనవారిలో గ్రంథములు దాచివేయు దురభ్యాస మున్నది. బెజవాడలో ఒక ఎఫ్. ఏ, విద్యార్థి తనకు కళాశాలలో పెట్టిన పద్య

భాగము నొక గ్రంథమునుండి చదివి వించుకు పోయినాడు. చదువుకొన్నవారే ఇట్లుండగా మిగిలినవారివిషయము వేరే చెప్పనక్కరలేదు మన దేశము బానిసదేశముగా నున్నది. మనకు ఇట్టి బానిసభావా లుండడములో నాశ్చర్యములేదు.

మన దేశమందలి గ్రంథాలయములలో బాలుర జ్ఞానాభివృద్ధి విషయమై నిరాదరణ చూపుచున్నాము. పాశ్చాత్య దేశములలో సగము ధనము పిల్లల కోసము వినియోగించెదరు. వారికి 'చదువనేది జీవితములో ఒక ఆట' అని బోధపడేటట్లు చూడాలి."

ఉపన్యాసముల అనంతరము శ్రీ పురిపండా అప్పలస్వామిగారు ప్రవేశపెట్టిన ఈ క్రిందితీర్మానములు ఏకగ్రీవముగా నంగీకరింపబడినవి.

తీర్మానములు

(క) ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు శాఖగ గ్రంథాలయోద్యమమును ఈపట్నమున వ్యాపింపజేయుటకుగాను "విశాఖపట్టణగ్రంథాలయసంఘము" అను పేరుతో నీసంఘమును స్థాపించుటకు తీర్మానించడమైనది.

(ఖ) ఈక్రిందివిధముగా నీసంఘకార్యనిర్వాహకవర్గము నెన్నుకొనడమైనది. అధ్యక్షులు:— ఎన్. ఎస్. త్యాగరాయశాస్త్రిగారు, ఉపాధ్యక్షులు:— ఓరుమళ్ళ రామారావుగారు, బుద్ధిరాజు శ్రీశైల మల్లిఖార్జునరావుగారు, కార్యదర్శులు:- మల్లిమడుగుల జగన్నాథరావుగారు, మహమ్మదు షజులుద్దీనుగారు. కార్యనిర్వాహక సభ్యులు:- వేపా వేంకటేశ్వర్లు, సబ్నివీసు సత్యకేశవరావు, చేబ్రోలు సీతారామచంద్రరావు, పురిపండా అప్పలస్వామి, వంకాయల నరసింహగుప్త, వెలిదెండ్ల చూడుకుడుతమ్మ, బులుసుసూరమ్మ, వెలిదెండ్ల శ్రీనివాసరావు, తెన్నేటివిశ్వనాథము, యస్. డి. థామసు గార్లును తక్కినగ్రంథాలయముల కార్యదర్శులును.

(గ) పరస్పరసహాయముతో కలిసి పనిచేయుటకు ఈ పట్టణములలోని గ్రంథముల పేర్లను చేర్చి "కేంద్రపట్టిక" నొకటి తయారుచేయవలెనని ఈసభవారు తీర్మానించుచున్నారు.

(ఘ) ఈ పట్టణములోని గ్రంథాలయముల చరిత్రను తయారుచేసి జిల్లా గ్రంథాలయసంఘ కార్యదర్శిగారికి అందజేయవలెనని తీర్మానించుచున్నారు.

(ఙ) ఈ పట్టణములోని పేదలకు అందుబాటులో నుండునట్లు వారి కాలమునకు అనుగుణముగ గ్రంథములను వారికి చదివి వినిపించుటకు అవసరమయిన ఏర్పాట్లుచేయుటకు ప్రయత్నించవలెను.

(చ) ఈసంఘముయొక్క కార్యస్థానము హిందూపఠనమందిరములో పెట్టుటకు తీర్మానించడమైనది. ఇందుల కంగీకారమీయవలయునని ఆగ్రంథాలయ నిర్వాహకులను కోరుటకుతీర్మానించడమైనది. వందనములతో సభ ముగిసిన పిమ్మట ముస్లిముగ్రంథాలయమును శ్రీ వేంకటరమణయ్యప్రభృతులు దర్శించి సదభిప్రాయముల నొసగిరి.

గ్రంథాలయ సేవయే ప్రజాసేవ

# గ్రంథాలయోద్యమము

పై శీర్షికతో హైదారాబాదు బులెటినుపత్రిక గ్రంథాలయములకు సహాయము చేయదలపెట్టి ప్రభుత్వమువారు చేయుచున్న విచారణలపై వ్యాఖ్యానముచేయుచు నిట్లువ్రాయుచున్నది.

"ఇంతకాలమునుండికూడ, ప్రజలును, పత్రికలును గ్రంథాలయోద్యమమునకు సహాయము చేసి యీరాష్ట్రమున విద్యాభివృద్ధి చేయవలసిన అవసరమును అవకాశమును చిక్కినప్పుడెల్ల ప్రభుత్వమువారి దృష్టికి తెచ్చుచునేయుండెను. ప్రజావిద్యా మహాసభయు, ఆంధ్ర మహాసభయు, ఈవిషయమై ప్రత్యేకముగ నొక్కి చెప్పినవి. తుదకు ప్రభుత్వమువారు అన్నివిధములవిద్యావిధానసంస్కరణమును గూర్చి ఆలోచించు సమయమున అట్టిది యెంతమంచిదో గ్రహించినందుకు సంతోషించుచున్నాము ఇక్కడ విద్యావ్యాప్తి చాలమందగతిగనున్నదనునదియు, విద్యావిహీనతను త్వరగా పారద్రోలవలసినచో పాఠశాలలలోను కళాశాలలలోను జరుగుపనికి దోడుగా గ్రంథాలయోద్యమముగూడ చేర్చబడవలెనను నదియు స్పష్టవిషయములే. ప్రభుత్వమువారు ఈ ఉద్యమమునందు ఆదరముగలవారుగనేయున్నారని తెలియుచున్నది. అందుకు వారినభినందించుచు అట్లుచేయుటలో ఆంధ్రమహాసభవారినికూడ అభినందించుచున్నాము. పోయిన డిసెంబరునెలలో ఖమ్మంమెట్టులో జరిగిన ఆంధ్ర మహాసభయందు ప్రభుత్వమువారిని బరోడాలో నున్నట్లే గ్రంథాలయోద్యమమును ఈరాష్ట్రమునకూడ ప్రారంభించవలయుననియు, ప్రజలచే నిర్వహించబడు గ్రంథాలయములకు షాహి, మునిసిపల్, లోకల్ ఫండు నిధులనుండిసహాయము చేయవలయుననియు ప్రార్థించు తీర్మానమొకటి చేయబడి యుండెనుగదా! ప్రభుత్వమువారు ఆతీర్మానముపై నింతత్వరగా చర్యగైకొనిరనునది ఆంధ్రమహాసభకు నితరులకు లభించని గొప్పతనము లభించుటయేయగును. కొంతమంది ప్రజానాయకులకు ఆంధ్రమహాసభను సమావేశపరచినవారు సదరు మహాసభను సమావేశపరచుటకు ముందుగ ప్రభుత్వమువారు విధించిన కొన్నిషరతులకు అంగీకరించియుండుటవల్ల మహాసభ కోరిక సిద్ధించలేదనియు మేమెఱుగుదుము ఆంధ్రమహాసభ మితవాదపక్షీయులగు ప్రజానాయకులచే నడుపబడుసంస్థయని ఒప్పుకొనుచు మేము ఆమహాసభ మితవాదాభిప్రాయము గల్గియుండుటవలన మాత్రమే దాని పలుకుబడి సాగుచున్నదని విశ్వసించుచున్నాము. ఈ సందర్భమున మేము ప్రజావిద్యామహాసభయొక్క స్థాయిసంఘమువారు ప్రస్తుతము తమకు ప్రభుత్వమువారికి మధ్యగల అంతరమును దాటువిషయమై త్వరలో నేదోయొకతీర్మానమునకు రావలసినదని సూచించగోరుచున్నాము. మహాసభను సమావేశపరచుటకు ముందుగ నగదు జమానతు నీయవలసినదని ఒకషరతును అధికారులు విధించినారు. ఇదిమాకును చాల విచారకరము. అయినను అనిష్టములగు షరతుల కొర్చుకొనియైనను ప్రజాహితమునకై పనిచేయుటలోనే వివేకముగలదు. ప్రజామహాసభ చాలకాలము నుండి ఆందోళనావస్థలోనేయున్నది. ఇందుకుగల కారణములు దానివశమునలేవు; వాస్తవమే. కాని ప్రజాహితము ప్రధానముగనుక ఆసభవారు ఆవిషయమును దృష్టిలోనుంచుకొని అధికారులు వారిసహాయములేకుండ విద్యాసమస్యలపై తీర్మానించకుండుటకుగాను యిష్టముకాని షరతులకైనను అంగీకరించవచ్చును. ఈ సూచనను మేము ప్రజామహాసభయొక్క స్థాయిసంఘమునకేగాక ప్రభుత్వమువారికిని జేయుచున్నాము. ఏలయన: ఇరువురి సహకారమువల్ల మాత్రమే యీరాష్ట్రమందలి విద్యాసమస్య అధికారులకును ప్రజలకును ఉభయులకును తృప్తికరముగ పరిష్కారము కాగలదని మాకు తోచుచున్నది.

# గుంటూరు మండల దశమ గ్రంథాలయ మహాసభ, రేపల్లె

అక్టోబరు, 1935.

మద్దుల వెంకటగిరిరావుగారి

# ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము

మంగళకరమగు నీసుముహూర్తమున విద్యావంతులును దేశసేవాపరాయణులు నగు మిమ్మాహ్వానించి యాదరించుటకు సమర్థులెందరో యుండగా నాకీ యవకాశ మిచ్చినందులకు నేనాహ్వానసంఘమువారి కెంతయు కృతజ్ఞుడను. మీవంటి మహాపురుషుల దర్శనముచేత మేమును, మా సోదర పట్టణవాసులును ధన్యులము. గమ్యస్థానము దూరమనక తమకుగల కార్యభారములను సరకుగొనక, మాయాహ్వానముల నంగీకరించి, యీ సరస్వతీపూజయందు మాతో భాగస్వాములౌట కరుదెంచిన భాషాసేవకులకును, నుపన్యాసకులకును, సదస్యులకును సుస్వాగతము.

మన రేపల్లెసీమవాసియు, అఖండత్యాగమూర్తియు, దేశసేవాధురంధరుడును, బహుభాషాకోవిదుడును, మన ఆంధ్రదేశనాయకులును, కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారికి యిందుగా నామనఃపూర్వకవందనము లర్పించుచున్నాను.

వందలకొలదిఏండ్లజ్ఞాతముగా బరువులెత్తిన వైనకభారతజాతీయత మరల తలయెత్తబూనుకొను టెంతయు శుభస్కరము.

అమెరికా, ఇంగ్లండు మొదలగు దేశములలో గ్రంథాలయోద్యమమే ప్రత్యేకజాతీయ నిర్మాణమునకు కారణము. ఆయా దేశములలో జరిగిన మహత్తర ప్రయత్నములగురించియు "కార్నెగీ" మొదలగు కోటీశ్వరుల మహాత్యాగములను గురించియు నిచట వివరింపజాలనందులకు చింతిల్లుచున్నాను. దానిని గురించి చెప్పదలంచుకొన్నచో భారతమునకంటె పెద్దగ్రంథమగుట యుపప్రస్తుతాంశమునుగూర్చి యుత్సాహాతురులైయున్న మీ యమూల్యావకాశమును నేనపహరింపవలసివచ్చుటయు యుక్తముకాదు. ఈయుద్యమమునందు, బ్రిటిషు యిండియాయును, స్వదేశసంస్థానములుగూడ సమముగా పాల్గొన్నవి. కాని ఏయితరరాష్ట్రముగూడ బరోడారాష్ట్రముతోసమానముగా ముందునకు రాజాలకపోవుట చిత్రము. బరోడాసంస్థానమువారీ యుద్యమము నాదరించి ప్రభుత్వపక్షమున విద్యావంతుల నితరదేశములకంపి వారివిధానమును నేర్పించి గ్రంథాలయోద్యమమును ప్రభుత్వశాఖలలోనొకదానినిగా చేయగలిగిరి. సంస్థానములోని ముఖ్యనగరములలో గ్రంథాలయములు స్థాపించి సంచార గ్రంథాలయ పద్ధతిమీద పల్లెపల్లెకును విజ్ఞానమును వెదజల్లిరి. నిజాంరాష్ట్రమునగూడ నేడు గ్రంథాలయములు విరివిగానే యున్నవి. ఒక్కింత ఆంధ్రరాష్ట్రమునుగురించికూడ మనవిచేయుదును. ఆర్యవిజ్ఞానమువలె నీయుద్యమముగూడ దక్షిణాపథమున కరుదెంచినపుడు తెలంగాణము యొక్క ప్రాచీన విజ్ఞానము విస్మృతియవనికనుండి వెలికి చూచినది. నశించి పోవుచున్నవారి విజ్ఞాన కోశముల నొక్కచో సేకరించి రక్షింపవలసిన యవసరము వారికి గోచరించినది. ఈతన్మయతలో పల్లెపట్టణభేదము లేకుండ నెన్నియో గ్రంథాలయములు నెలకొల్పబడినవి. ఈ గ్రంథాలయముల యభివృద్ధికి నైక్యతకు తోడ్పడుటకు గ్రంథాలయ సర్వస్వమను పత్రిక ప్రారంభింపబడినది. ఆంధ్రరాష్ట్ర కేంద్రగ్రంథాలయ నిర్మాణప్రయత్నములు జరిగినవి. ఒక్కొక్క—

మహాసభలు ప్రారంభింపబడినవి. ప్రజలత్యుత్సాహముతో బాధ్యత వహించుచుండిరి. కాని ఆంధ్రులు ఆవేశప్రియులు. అప్పటికి భారతదేశమునకు మహాత్ముని స్వాతంత్ర్యశంఖారవము ఘోరుకొన్నది. దేశమునందలి అన్ని యుద్యమముల దృష్టియు ఆమహోద్యమము వంకకు మరలినది. విశ్వమానవ కళ్యాణములకు ముఖ్యముగా భారత కళ్యాణమునకు గావింపబడుచున్న యీశాంతి సమర మితరకార్యోత్సాహములకు చోటీయక పోవుటచేత గ్రంథాలయోద్యమము మందగించినది. రాష్ట్రీయ గ్రంథాలయ నిర్మాణ ప్రయత్నములు చల్లబడినవి. గ్రంథాలయ సర్వస్వము, పాఠకుల కనుమొరింగినది. అనేక గ్రంథాలయములు పుస్తకములు పాఠకులచేతులలో చిక్కుపడుటచేత శిథిలములు, నామావశిష్టములు కావలసివచ్చెను. ఈమండలమున మనతో గూడకలసి పనిచేసిన గ్రంథాలయము లెన్నియో నిర్జీవములు, రూపరహితము పోవలసి వచ్చినందులకు మనమందరమును దుఃఖపడవలసియున్నది. ఇట్టి విషమపరిస్థితులలో కూడ ప్రత్యేకశ్రద్ధవహించిన గ్రంథాయాభిమానులకు నాధన్యవాదములు. ఈనూతన యుగమున గ్రంథాలయోద్యమము కూడ సర్వ సామాన్యజనులకు సహాయముగా నుండి వారియభివృద్ధికి తోడ్పడ వలెను. ప్రతి గ్రామమునకు మంచినీటిబావి యెంత ఉపయోగమో, ప్రతిమానవ శరీరమునకు వాయువెంత ఉపయోగమో, మానవులకు గ్రంథాలయములు కూడ అట్టివేయని తలంచవలెను. ప్రతిమండలమందును, ప్రతిఖండము లేక సీమయందును, ప్రతిగ్రామములోను ప్రచారముగావించిగ్రంథాలయములు స్థాపించ ప్రయత్నించవలెను. లేనియెడల గ్రామజీవితము అభివృద్ధిపొందనేరదు. గ్రంథాలయసేవయే ప్రజాసేవ. యువకులు, పెద్దలును, కూడ నీ యుద్యమములో పనిజేయుట కవకాశమున్నది. మనోవికాసమే జీవనాధారము. ఉత్సాహము, మనోవికాసములేని జీవనము నిరర్థకము. కావున ఓ సోదర సోదరీమణులారా! గ్రంథాలయాభిమానులగు మిమ్ములను నేను ప్రార్థించునది యేమనగా:— ప్రతిగ్రామమునను గ్రంథాలయములను నిర్మింపవేడుచున్నాను. గ్రంథాలయములు ఆటస్థలములు కాకూడదు. గ్రంథాలయమున గ్రంథపఠనముగాని పత్రికా పఠనముగాని యితరసాహిత్యప్రసంగములుగాని యుండవలెను. గ్రంథాలయాధికారులు నెలకొక సారియైన విద్యావిషయక ప్రసంగముచేయుటకు సభ్యుల కవకాశము కలుగజేయవలెను. మరియు ప్రస్తుతదశ సంచలనములో గ్రంథాలయోద్యమముకూడ ముఖ్యస్థానము నాక్రమించవలెను.

గ్రంథాలయ సేవకులు ఓర్పు, పట్టుదల, ఉత్సాహముకలిగి యుండవలెను. గ్రంథాలయోద్యమాభిమానులు గ్రామములోని యితరసంస్థలలో తగుల్కొని యుండక నిరాడంబరముగ పని జేసినచో విశేషఫలితము చేకూరును. దేశము యొక్కసమిష్టి ఆదర్శమునకు వెనుకాడు నే సంస్థయు అభివృద్ధి పొందజాలదు. అస్పృశ్యతా నిర్మూలనమున కొక తీరుగడ నేటి కగుపించుచున్నది. అది అత్యవసరమని ప్రముఖులందరు గూడ నంగీకరించుచున్నారు.

ప్రస్తుతము గ్రంథాలయములకు స్వంతభవనములుచాలాఅరుదుగా నుండుటచేత అస్పృశ్యులనబడు వారికి గ్రంథాలయ ప్రవేశమునకు అభ్యంతరములు కలుగుచున్నవి. అది సమకూరని నాడు, జాతీయతానిర్మాణము ప్రహసనము మాత్రమే యగును కావున దానికి మనము తోడ్పడుటకునుగ్రంథాలయముల సమిష్టిసౌభాగ్యములను చెదరగొట్టకుండుటకును ప్రతి గ్రం

థాలయమునకును ప్రత్యేక భవనములు అవసరమని నేను మనవిచేయుచున్నాను. దేశమునందెన్నియో మార్పులు రానున్నవి. వానిలో స్త్రీజనాభ్యుదయముకూడ నొకటి. పరిపాలనమునందు స్త్రీలకు ప్రాతినిధ్యము లభించినది. ఇంకను లభింపనున్నది. కావున వారుగూడ పురుషులతో బాటు సమానమగు విజ్ఞానము కలిగియుండు టవసరము. కావున ప్రతిగ్రంథాలయములోను స్త్రీలకు తగిన సౌకర్యములను కలిగించవలె నని నా ప్రార్థన. ఇప్పటికి నేను గడువుమీరి యుందును. కావున నపర భారతమూర్తు లగు మీకందరకు శ్రమకలిగించినందులకు క్షమాపణ వేడుచున్నాను. మా ఆహ్వానములను మన్నించి యిచటికి దయచేసి మమ్మానందపరచిన సభ్యులెల్లరకు సంఘముపక్షమున ధన్యవాదము లర్పించుచున్నాను.

భాషారాజ్యాంగవేత్తలగు మీరెల్లరు పై సందర్భములు విచారించి ధర్మనిర్ణయము గావించుచు మా సేవాధర్మమునకు మార్గదర్శకులును, సహాయులు నగుటకు ప్రార్థించుచు నీవిన్నపమును ముగించుటకు సెలవు కోరుచున్నాను. మహాశయులారా! పునరభివాదములు.

# గుంటూరు మండల గ్రంథాలయ దశమ మహాసభ, రేపల్లె

మహాసభను ప్రారంభించిన

మ న్నే ప ల్లి రా మ కృ ష్ణ రా వు పం తు లు గా రి

## ఉపన్యాసము

గ్రంథాలయోద్యమాభిమానులారా!

ఈ గుంటూరుమండల గ్రంథాలయ దశమ మహాసభను ప్రారంభించు సంతోషకార్యమును నాయందునిచిన మీ యాహ్వానసంఘమువారి కనేక కృతజ్ఞతాపూర్వక వందనములు. మీ ప్రక్కమండలమగు నెల్లూరుజిల్లాలో గ్రంథాలయోద్యమమున మేముచేయు కొలదిపాటి సేవను మీరు గమనించి, మా మండల గ్రంథాలయోద్యమసేవకుల గౌరవింప నెంచిన మీ యుదారప్రేమాతిశయము లే నన్ను కార్యమునకు నియోగించుటకు ప్రేరించి యుండనోపు నని భావించుచు, నేటిసభలో పాల్గొని యీ యుద్యమమునం దనుభవపరులగు మీవలన నూతనాంశముల నేర్చుకొన నాకు అవకాశ మొసంగిన మీ యాహ్వాన సంఘ సభ్యులకు మఱల ప్రణామము లర్పించుచున్నాను.

1910 వ సంవత్సరం డిసెంబరు 29 తేదిన నేను సహాయకార్యదర్శిగా నుండగా నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియనువారు తిక్కన గ్రంథాలయమును స్థాపింప మహాజనసభలో తీర్మానించి నప్పటినుండియు, నీ గ్రంథాలయోద్యమముతో నాకు సంబంధముకలిగినది. నాడు 450 గ్రంథములతో ప్రారంభింపబడిన ప్రోగ్రెసివ్ యూనియనువారి గ్రంథాలయము, నేడు 8000 వేల ఆంగ్ల-ఆంధ్ర సంస్కృత గ్రంథములతో విరాజిల్లుచు మండలీయుల ఆదరణ నెక్కువగ బడసి విజ్ఞానమును వెదచల్లుచు, నిర్విఘ్నముగ నానాటికి వర్ధిల్లుచున్నది. మా మండలములోని రెడ్డికులా

వతంసులును సహజౌదార్యసంపన్నులును సకల సదుద్యమ ప్రోత్సాహకులును కీర్తిశేషులు నగు రావుబహదూర్ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారి అభిమానమునుబడసి వారిచే శాశ్వతముగ దాన మొసంగబడిన దివ్యభవనములో నెలకొల్పబడి మా గ్రంథాలయములు సక్రమముగా పనిచేయు చున్న వని గ్రంథాలయోద్యమాభిమాను లగు మీరెల్లరు వినుటకు కుతూహలురై యుందురని నేను తలంచుచున్నాను.

1911 వ సంవత్సరమున బెజవాడలో రామ మోహన గ్రంథాలయము స్థాపింపబడినపిమ్మట, గ్రంథాలయోద్యమమునకు ఆంధ్రదేశమందంతట నెక్కువ వ్యాప్తిగలిగిన సంగతి సర్వజనవిదితమే. ఈ వ్యాప్తికి కారణభూతులై ఆంధ్రభూమి యందేగాక అఖిలభారతవర్షమునం దీయుద్యమ మును వ్యాపింపజేయ విశేష శ్రమపడిన కీర్తి శేషులగు సూరి వెంకట నరసింహ శాస్త్రి గారి నిమనము మరువజాలము. 1916 వ సంవత్సరము మే నెల 12 తేదిన ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల తృతీయ మహాసభను నెల్లూరులో మేము జరిపినపుడును, 1920 వ సం వత్సరము నవంబరు 20, 21 తేదులలో నెల్లూరు మండల గ్రంథాలయ మహాసభను మేము జరిపి నపుడును, శ్రీశాస్త్రిగారును, శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారును మాకెంతయో తోడ్పడిరి. శ్రీశాస్త్రిగారు నాటి మండలమహా సభ కధ్యక్షతనుగూడ వహించియుండిరి. ఈ యిరువురు మహాశయుల కార్యదీక్షవలనను, వారికి ఇతరు లొసంగిన ప్రీతిపూర్వకమగు సహ కారమువలనను, గ్రంథాలయోద్యమ మపుడు గ్రామములకు వ్యాపించి అనేక గ్రామములలో గ్రంథాలయములుద్భవించుటకు కారణమయ్యెను. కాని ఆ ఉత్సాహము కొంతకాలము చెలరేగి ఆవల రాజకీయ కల్లోలమువలన తగ్గినపుడు, దేశ సేవకులదృష్టి యంతయు గాంధిమహాత్ముని భారతదేశోద్ధరణ కార్యనిర్వహణసాధన మగు సత్యాగ్రహోద్యమమునందు లగ్నమైనది. స్వరాజ్యము సంపాదించుకొని పరిపాలనాయంత్ర మును దేశీయుల హస్తగతము గావించుకొనిన గాని భారతదేశ శ్రేయోభివృద్ధి త్వరితగమన మున కొనసాగనేరదనియు, భారతదేశము నాగ రక ప్రపంచములో తలయెత్తుకొని తిరుగజాల దనియు, మాతృదేశాభిమానులు దృఢమనస్కు లై, సర్వశక్తుల రాజకీయరంగమున వినియో గించుచు పోరాడుచుండిరి. అట్టికారణమువలన గ్రంథాలయోద్యమ వ్యాప్తియు, కార్యక్రమ మును, షుమారు 10, 12 సంవత్సరములు ఆగ వలసివచ్చెను. పరిపాలకుల తీవ్రనిర్బంధనచర్యల వల్లనైననేమి, ఇతర కారణములవల్లనైన నేమి? శాసనోల్లంఘనోద్యమము ఉపసంహరించు కొనబడినపిమ్మట ఆగియుండిన గ్రంథాలయో ద్యమము మఱల గ్రంథాలయాభిమానుల దృష్టి నాకర్షించుటయు, గ్రంథాలయోద్ధారక శ్రీయుత, అయ్యంకి వేంకటరమణ య్యపంతులు గారు కార్యరంగమున ప్రవేశించి సహజదీక్షతో పట్టుదలతో కార్యముల నడిపించుటయు, మరల నిపుడు ఉద్యమము నూతన తేజముతో విరా జిల్లుటయు సంభవించినవి. మఱల గ్రంథాలయ సభలు ప్రదర్శనములు ఉపన్యాసములు వార్షి కోత్సవములు ఎటుచూచినను జరుగుచుండుట అత్యంతముదావహము.

ఈ ఉద్యమవ్యాప్తికేగాక మఱేయుద్యమ వ్యాప్తికిని మనకు గొప్పఆటంకము మన దేశజుల బీదఱికము అజ్ఞానము నిరక్షరత్వము అని మన కెల్లరకు తెలిసినవిషయమే. వీని నెదుర్కొనుటకు మనశక్తి కొలది మనము సంసిద్ధులము కావలయును.

స్వపరిపాలనము ననుభవించు రషియా, అమెరికా, ఇంగ్లండు, జర్మనీ, జపాను మొదలగు దేశము లెల్ల నత్యంతశీఘ్రకాలములో తమ దేశజుల నిరక్షరత్వమును రూపుమాపుకొని తమ ప్రజ లలో జ్ఞానోదయమును కలిగించుకొని సర్వవిధ ముల నభివృద్ధిగాంచుచుండగా, ఇంగ్లాండులో నూటికి 1.8 మంది, స్కాట్లెండులో నూటికి 1 6, అమెరికాలో నూటికి 7.7 మంది మాత్రమే చదువురానివారై యుండగా, మన ధర్మకర్త లని చెప్పుకొను ఆంగ్లదేశజుల పరిపాలనలో సుమారు 150 వత్సరములు లోబడియున్న మన దేశ ములో, నిప్పటికి నూటికి సుమారు 90 మంది చదువురాని వారుగా నుండుట, ఎంతటి హృదయ నిర్భేదకమగు విషాదమో, ఆంగ్లులచే ధర్మకర్తృత్వమెటుల నిర్వహింపబడుచున్నదో, మన మెట్టి నిస్సహాయస్థితిలో నున్నామో మన మనుదినము స్మరింపక తప్పదు. మన రాష్ట్రము లోని జననసంఖ్య స్వదేశ సంస్థానములతో కూడ కలిపి లెక్కించినచో 4,71,93,602. వీరిలో చదువుకొనినవారి సంఖ్య 43,67,545 చదువురానివారి సంఖ్య 4,28,26,057. అనగా యీ రాజధానిలో నూటికి తొమ్మిదిమంది మాత్రమే చదువుకొనినవారు, 91 మంది అక్షరజ్ఞానము బొత్తుగా లేనివారు అని 1930 వ సంవత్సరపు ప్రభుత్వ సెన్సెస్ లెఖ్కలే తెలుపు చున్నవి. స్వదేశసంస్థానముల జనసంఖ్యను వదలి వేసినచో మొత్తపు బ్రిటిష్ఇండియాలో గల సుమారు 27 కోట్లమంది ప్రజలకు 1931-32 సంవత్సరపు లెక్కప్రకారము సుమారు 13కోట్ల రూప్యములనుఅనగా మనిషి1కి రు0-8-0ల వంతున మాత్రమే మన ప్రభుత్వమువారు మన దేశీ యుల విద్యకై వ్యయపరచినారని మదింపువేయ బడినది. ఆంగ్లేయుల మాతృభూమియగు ఇంగ్లండు దేశమున ఒక్క లండన్ నగరరాజమునందే 1933-34 లో విద్యాభివృద్ధికై 1,27,17,354 పౌండ్లు అనగా రు 16,95,64,720 లు లండన్ మునిసిపాలిటీవారు మాత్రమే వ్యయపఱచి యున్నారు. అనగా లండను మునిసిపాలిటీ జనసంఖ్యయగు 44 లక్షలమంది ప్రజలకు సుమారు 17 కోట్ల రూప్యములను విద్యకై వారు వ్యయపెట్టియుండగా, మన దేశమున బ్రిటిష్ రాష్ట్రములలోని సుమారు 27 కోట్లమంది ప్రజ లకు గవర్నమెంటువారు, జిల్లాబోర్డులు, మునిసి పాలిటీలు అందరు కలసి సుమారు 17 కోట్ల రూప్యములు వ్యయపెట్టుచున్నారు. అనగాఒక్క లండన్మునిసిపాలిటీ మాత్రమే సాలుకు మనిషి 1కి రు 38 లు వంతున వ్యయ పరచుచున్నది; మన దేశమునందో ప్రభుత్వమువారు మునిసిపాలి టీలు జిల్లాబోర్డులు అందరు కలిసి మనిషి 1కి రు0-8-0 వ్యయపరచుచున్నారు. పరిస్థితు లిట్లుం డగా మనలో నూటికి 91 మంది అక్షరజ్ఞాన శూన్యులుగ నుండుటలో ఆశ్చర్య మేమున్నది? ప్రభుత్వమువారు ఎక్కువ ద్రవ్యమును విద్యా భివృద్ధికై వ్యయపఱచి తీవ్రమైన కార్యప్రణా ళికను వెంటనే ఆచరణయందుంచి నిరక్షరత్వ మును రూపుమాపిన గాని, ఏ యుద్యమమును ఏ సంస్కరణమును తృప్తికరమగు ఫలితముల నియ్యజాలదు. కాన గ్రంథాలయోద్యమాభి మాను లిందుకు తగిన యాందోళనమును నిరంత రము చేయుచుండుట అత్యంతావశ్యక మని తలంచుచున్నాను.

దుర్భర దారిద్ర్యమున మగ్గుచున్నను ప్రభుత్వ సహాయము అత్యల్పముగ నున్నను నిస్పృహులమై ఉదాసీనులమై మనముచరించి కాలముగడపనేరము. శక్తికి తగిన పనుల నైన చేసితీరవలయును. కొన్ని గ్రంథాలయములు

రాత్రిపాఠశాలలను నిర్వహించుచుండుట శ్లాఘనీయము. గ్రంథాలయములు విద్యావ్యాపకమున తమ బాధ్యతను గుర్తెఱింగి తమ కార్యభాగమును నిర్వహింపక తప్పదు. "గ్రామములకు మరలుడు!" అను ఘోష ఎచ్చట జూచినను అనేక కారవిద్యాధికుల వాక్కులనుండియే గాక యధికారుల ప్రబోధములనుండికూడ వెడలుచున్న యీ తరుణమున, యువకులగు విద్యావంతులు వేలకొలది పనులులేక నిరుత్సాహులై ఆధునిక విద్యావిధానపద్ధతిని నిందించుచున్న యీతరుణమున, గ్రామవాసులలో నిరక్షరత్వమును రూపుమాపుటకు యువకులకు అవకాశములను గల్పించుటయందు గ్రామ గ్రంథాలయములును మార్గదర్శకత్వమువహించుట అవసరము నపేక్షణీయమును.

పట్టణములకన్న గ్రామములవంకనే విద్యాధికులగు యువకులదృష్టి యెక్కువగ ప్రసరింపవలసియున్నది. భారతీయులలో నూటికి 89 మంది గ్రామములలో నివసించువారై యున్నారు. నూటికి 11 మంది మాత్రమే పట్టణములలో నివసించువారు. విదేశములకును మనకును ఈ విషయమున వ్యత్యాసము చాలకలదు. ఇంగ్లండ్ అండ్ వేల్సులో నూటికి 20 మంది గ్రామములలో, 80 మంది పట్టణములలో నివసించువారు. అమెరికాలో యునైటెడ్ స్టేట్సులో నూటికి 44 మంది గ్రామములలో, 56 మంది పట్టణములలో, ఫ్రాన్సులో నూటికి 51 మంది గ్రామములలో, 49 మంది పట్టణములలో; కెనడాలో నూటికి 53 పట్టణములలో, 47 మంది గ్రామములలో నివసించువారు. మన గుంటూరుజిల్లాసంగతిని విచారించిన, ఈ జిల్లాయొక్క మొత్తపు జనసంఖ్య 20,35,660 లో 2,78,365 మంది పట్టణములలో, 17,57,295 మంది గ్రామములలో నివసించుచున్నారు. అనగా నూటికి 13 మంది పట్టణములలో, 87 మంది గ్రామములలో నివసించుచున్నారు. కాబట్టి గ్రామములనట్టి దేశశ్రేయోభిలాషియును పేక్షింపజాలడు. కాబట్టి వారినుద్ధరించి విజ్ఞానవంతులుగ జేయ సమకట్టనిదే దేశమెంత మాత్రము అభివృద్ధి నొందజాలదు. అందువలననే గాంధిమహాత్ముని గ్రామపారిశ్రామికోద్ధరణ సంఘమువారి కార్యప్రణాళికయు, దాని ననుసరించుచున్న ప్రభుత్వమువారి కోటిరూప్యముల గ్రామ పునర్నిర్మాణ కార్యప్రణాళికయు నేడు గ్రామములపై నెక్కువ దృష్టిని ప్రసరించియుండుటయని మనకు స్పష్టము.

రాత్రిపాఠశాలల నిర్వహించుటయే గాక, గ్రంథాలయములు గ్రామప్రజలకు చేయతగిన సహాయము లింకెన్నియో స్ఫురింపగలవు. ఉచితముగ ఔషధసేవ చేయుటకును బీదలకు అపుడపుడు అన్నదానము చేయుటకును, కొన్ని గ్రంథాలయములు పూనియున్నవి. కుముదవల్లిలో శ్రీ వీరేశలింగకవిసమాజమువారిట్టి సేవ చేయుచున్నారు. వారి గ్రంథాలయము 1897 సం॥రం జూన్ నెల 22 తేదిన స్థాపింపబడి యీ 38 వత్సరములుగ శ్లాఘనీయమగు కార్యక్రమమును సాగించుచున్నదని వినుటకు సంతోషించుచున్నాను. ఇట్టికార్యవిధానములను వీలైన చోట్లలో గ్రంథాలయములు ఆచరణలోనికి తేవచ్చును. అపుడు ప్రజలకు వీనియందు ప్రేమ కలిగి, వలసిన ధనాదిసహాయములు లభ్యపడి గ్రంథాలయములు యెక్కువ ప్రజానురంజకముగ జనోపయోగకరముగ నిలసిల్లగలవు.

గ్రంథాలయములకు గ్రంథముల సేకరించుటలో నెక్కువ విచక్షణతతో కార్యనిర్వాహకులు వర్తించుట అవసరము. గ్రంథముల సంఖ్య నెక్కుని పెంపొందించవలెనను ఆశతో మెలంగ

రాదు. ఐహికాముష్మికసుఖముల నొందజేయు విజ్ఞానమును ప్రసాదించునట్టి గ్రంథరాజముల నాలయమునజేర్చుచు, అట్టి గ్రంథములను చదువువారు వీలైనపుడు చదువుకొనజాలని వారిని చేర్చి వానిని చదివి యందలి అంశములను బోధించుచు, విజ్ఞానమును వెదజల్లుచు, గ్రంథాలయము నెల్లర కుపయోగకారిగా నొనర్పవలెను. పురాణాదికాలక్షేపములును, గ్రంథాలయములలో జరుపుటవలన జ్ఞానాభివృద్ధికి తోడ్పడగలవని కొన్ని గ్రంథాలయములు ప్రత్యక్షముగ రుజువుచేయుచున్నవి. కావున ఈ విధానమును కూడ గ్రంథాలయములు అవలంబింప జ్ఞప్తి యుంచుకొనుట ఫలదాయకము. కేంద్రగ్రంథాలయములను సంచారగ్రంథాలయములనుకూడ వీలైనచోట్లలో నెలకొల్పుట అవసరము.

ప్రభుత్వమువారు గ్రంథాలయముల కిటీవల గ్రాంటుల నొసంగ బ్రారంభించినారు. కాని వారొసంగు మొత్తముగాని వారు నిర్ణయించు పద్ధతులుగాని ఉద్యమవ్యాప్తియొక్క త్వరితగమనమునకు తోడ్పడజాలకున్నవి. ఈ గ్రాంటు కోరే గ్రంథాలయమువారు, వారుకోరే గ్రాంటు మొత్తమునకు సమానమైన మొత్తమును ముందుగా సేకరించుకొని దానిని గ్రంథములకై వారు స్వయముగ వ్యయపరుప బూనినగాని, ప్రభుత్వమువారి గ్రాంటు లభ్యపడదు. అనేక గ్రంథాలయము లీ షరతును నెరవేర్పజాలక ప్రభుత్వసహాయము నపేక్షింపజాలకున్నవి. అపేక్షించునవియు బహు స్వల్పమొత్తములనే విధిలేక కోరుకొనవలసిన దురవస్థలో జిక్కుకొని యున్నవి. ఈ నిబంధనను ఈ బీదదేశమునం దాచరణయందుంచుట పాడికాదు. దీనిని రద్దుపఱచుట అవసరమని నాఅభిప్రాయము. కొత్తగా రద్దుపఱచుట అనపేక్షణీయమని తలంపబడినచో ప్రభుత్వమువారిచ్చుగ్రాంటునకు సమానముగా గాక అందు పాతికభాగముగల మొత్తమును దరఖాస్తుదారులు స్వయముగా సేకరించుకొని వ్యయపరుపవలెననిన చాలునని తోచుచున్నది. స్వయంసహాయము నంతమాత్రముబలాత్కారముగ విధించినచో గ్రంథాలయము లెక్కువగ ప్రభుత్వసహాయము నుపయోగించుకొనుటకు ఎక్కువగ్రామములలో గ్రంథాలయములుజనించి పెంపొందుటకు అవకాశముకలుగును.

గ్రామములలో గ్రంథాలయములు వృద్ధికి రావలెననిన ప్రభుత్వధనసహాయ మిప్పటికన్న ఎక్కువగ చేకూరవలయును. బరోడాసంస్థానమునందు గ్రంథాలయాభివృద్ధి యెంత త్వరితముగా వ్యాపించినదో ఆ సంస్థానమువా రెంత ధారాళముగ ధనమును వ్యయపరచుచున్నారో మన ప్రభుత్వమువారు గమనించియేయున్నారుగదా. విదేశములలో గ్రామ గ్రంథాలయము లెట్టి ఉన్నతస్థితిలో నున్నవో ప్రభుత్వమువారికి తెలిసినవిషయమే కదా. బ్రిటన్ దేశమున గాని, అమెరికా దేశమునగాని, రషియా దేశమునగాని, స్విట్జర్లెండు దేశమునగాని, జర్మనీ దేశమునగాని, డెన్మార్కు దేశమునగాని అత్యంత ప్రాముఖ్యమని ఎంచబడిన ఈ గ్రంథాలయోద్యమమునకు ఆయా ప్రభుత్వములవా రెంత గొప్ప మొత్తములను ప్రతివత్సరము వ్యయపరచుచున్నారోమన ఆంగ్లపరిపాలకులకు తెలియనియంశములు కావు గదా. ఇంత పెద్ద మదరాసు రాష్ట్రమునకు 839 పట్టణములు, 51,487 గ్రామములుగల బ్రిటిష్ చెన్నరాష్ట్రమునకు సాలుకు ఇరువదివేలరూప్యములు గ్రంథాలయముల గ్రాంటులకై వ్యయపరచుచున్నామని ఘనముగా చెప్పుకొనుట పరిహాసాస్పదముగ గన్పింపదా? ద్రవ్యమెచ్చటనుండి వచ్చునని ప్రభుత్వమువారు ప్రశ్నించెదరు,

అందుకు మార్గముల నన్వేషింప బాధ్యత వహింపవలసినవారు ప్రభుత్వాధికారులే గాని ప్రజలు కారు. ఈ బీద దేశమునకు తగని, ప్రజలు భరింపజాలని, వేలకొలది మాస వేతనముల, ఉపకార వేతనముల, బత్యముల దుబారాగానొసంగి చేయువ్యయములను, సైనిక వ్యయములను, ప్రభుత్వ కార్యాలయములకు అధికారులనివాసములకు నిర్మించు దివ్యతమ సౌధములకై వెచ్చించు కోట్లకొలది ధనమును, ఈలాటి ఖర్చుల నెన్నిటినో తగ్గింపుమని యేటేట శాసనసభలలో దేశీయనాయకులు ప్రజాప్రతినిధులు పెట్టుమొఱలను ప్రభుత్వమువా రించు కేని లక్ష్యముజేసి ఆచరణయం దుంచిన చో, ప్రజాభివృద్ధికరములగు నీలాటి కార్యములకు వలసిన ధనము దొరుకు ననుటకు సందేహమేమున్నది?

ఈస్వల్ప గ్రాంటుల నైన పొందుటకు మరి యొక నిర్బంధనముకలదు. అదేమన: విద్యాశాఖాధికారిద్వారా మనము కొనదలచిన గ్రంథముల జాబితాను వారిఅంగీకారమునకు పంపవలయును. అట్లుచేయుటలో ప్రభుత్వమువారు నిషేధించిన గ్రంథముల కొనగూడదనుట న్యాయముగనుండ వచ్చును. కాని నిషేధింపబడని గ్రంథములను కూడ ఆయా అధికారియొక్క యిష్టానిష్టము లనుబట్టి పట్టికనుండి తొలగింపుడని కోరుట న్యాయముకాదు.

ఇటీవల గ్రంథాలయముల సొదాలు బహుళము లగుచున్నవి. పోలీసుశాఖవారు వారంటును కనుబరుపకయే, ఇచ్చవచ్చినపుడు గ్రంథాలయములలో ప్రవేశించి, తమకు యిచ్చవచ్చిన గ్రంథములను రశీదుల నియ్యకయే దౌర్జన్యముగా గొనిపోవుచున్నారని, కొందరు గ్రంథాలయ నిర్వాహకులు పత్రికలద్వారా తెలిపి యున్నారు. ఈ దౌర్జన్య కారణములను విచారించి, ఆదౌర్జన్యము నాపునట్లు చేయుటకు, అవసర మైనచోట సొదాలు సక్రమముగ చట్టసమ్మతముగ జరుగునటుల చేయుటకు, ప్రభుత్వమువారు శ్రద్ధగైకొనవలెనని విన్నవించుచున్నాను. మరియు ఏయే గ్రంథములు ప్రభుత్వమువారిచే నిషేధింపబడి రాజధానిగెజెటులో ప్రకటింపబడినవో వాని జాబితాను అప్పుడపుడు మూడుమాసముల కొకమారైనను సంపూర్ణముగా రాజధానిగెజెటులోను వార్తాపత్రికలలోను ప్రకటించుచుండినయెడల నట్టి గ్రంథములను గ్రంథాలయములలో లేకుండ చేసికొనుటకు గ్రంథాలయ నిర్వాహకులు శక్తియుతులై యుందురు. కాన ప్రభుత్వమువారటుల ప్రకటించుట అత్యావసరముగా నున్నది.

గ్రంథాలయోద్యమ వ్యాప్తికి ధనబలము, మనుష్య బలము ముఖ్యసాధనములని మనకెల్లరకు తెలిసినవిషయమే. మనము సేకరించుకొనగలిగిన స్వల్పధనమును ఎక్కువ ప్రయోజనకారిగ నుపయోగించు విధానములను మనము ఆలోచించుకొనవలెను. ప్రతిజిల్లాయందు ఈఉద్యమవ్యాప్తికి మన మెంతయో కృషి సలుప వలసియున్నది. ఉద్యమ సేవకు లనేకులు కావలయును. ఈ గుంటూరు జిల్లాయందు 926 గ్రామములు 20 పట్టణములు కలవుగదా! వీటిలో గ్రంథాలయములు లేని గ్రామములు, సుమారు నూటికి 90 వంతున నైననుండునని తోచుచున్నది. ఉన్న గ్రంథాలయములలో కూడ అనేకము తృప్తికరముగ పనిచేయుచుండుటలేదని తెలియుచున్నది. వీనిని పునరుద్ధరించుటకు గ్రామవాసుల కుత్సాహముకలిగించుటకుభీమవరము, తాడేపల్లిగూడెం. గ్రంథాలయాభిమానులు ఏర్పరచుకొని సాగించినట్టి గ్రంథాలయయాత్రలుచాలఉపయోగకరములుగ

నుండగలవని తోచుచున్నది. ఒక్కొక్క ప్రాంతమును నిర్ణయించుకొని, నలుగు రైదుగురు డుత్సాహపూరితహృదయులగు గ్రంథాలయాభిమానులు కలసి, గ్రామగ్రామమున బసచేయుచు, భజనల మూలమున గ్రామఫోనుమూలమున గ్రామప్రజల నొక్కచోట సమావేశపఱచి, ప్రబోధన మొనర్చి, గ్రంథాలయమున్నచోట దాని నెక్కువ ప్రయోజనకారినిగా జేయువిధానముల సూచించియు, లేనిచోట గ్రంథాలయమును స్థాపింప ప్రోత్సహించియు, యాత్రను సాగించినచో, ఉద్యమవ్యాప్తి చక్కగ స్థిరముగ శీఘ్రముగ జరుగగలదని తోచుచున్నది. ఈ జిల్లాయందు తాలూకాసంఘములు, జిల్లాసంఘము నెలకొల్పబడి పనిచేయుచున్నవని వినుటకు సంతోషించుచున్నాను. కొన్ని తాలూకాసంఘములు తాలూకాసభలను జరుపుచున్నవనియు తెలియుచున్నది. కొన్ని గ్రంథాలయములకు సొంత భవనములు కూడ కలవని తెలియుచున్నది. తెనాలితాలూకాలో సుమారు 12 గ్రంథాలయములు స్వకీయ భవనముల గలిగియున్నవని వింటిని. కావూరులో "భారత సేవకమండలి" అను గ్రంథాలయమునకు కొంత భూవసతియు స్వీయభవనమును కలవని వింటిని. కాని అచటి గ్రంథాలయమును మాత్రము ప్రజలెక్కువగ నుపయోగింపలేదని యిదివరలో సూచించి యున్నారు. ఇపుడెట్లున్నదో తెలియదు. గ్రంథాలయములకు సొంతభవనము లుండుట అవసరమే. కాని గ్రంథాలయమును స్థిరముగా జరుపగల వసతులున్నచోటనే సొంత భవనములకు యత్నముచేయుట మంచిది. మరియు ప్రతి గ్రంథాలయమును 1860 వ సంవత్సరం 21 వ ఆక్టు క్రింద రిజిస్టరు చేయించుకొనుట అవసరము. అపుడు ఆస్తిని సంపాదించుకొనుటకు సంఘము పేర వ్యవహరించుకొనుటకు అవకాశము కలుగును. గ్రంథాలయ రిజిస్ట్రేషనుకు ఫీజునుతగ్గించి తక్కువవ్యయముతో రిజిస్టరు చేసుకొనుటకు సౌకర్యమును గల్పింపమని మనము ప్రభుత్వమువారిని కోరవలయును.

పంచాయతీబోర్డులు, మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులుకూడ గ్రంథాలయోద్యమమునకు సహాయపడవలయును. వారు వ్యయముచేయు ఇతర వ్యయములతోపాటు గ్రంథాలయస్థాపనమునకు, పోషణమునకు వలసిన ద్రవ్యమును వారు వ్యయపఱచుట వారి విధ్యుక్తధర్మమని ఆయాసంస్థల నిర్వాహకులు జ్ఞప్తియందుంచుకొనవలెను. తమ పరిపాలనకు చెందిన ఆవరణములో నెలకొల్పబడిన గ్రంథాలయములకు వారును ద్రవ్యసహాయము చేయుటకు ప్రభుత్వమువా రాక్షేపింపకూడదు. జాతీయభావప్రదర్శనమునకు తరుణ మాసన్నమైనపు డనేక పర్యాయములు నిర్భయముగ నద్దాని గన్పరచి యితర మున్సిపాలిటీలకు మార్గదర్శకులై స్తుతిపాత్రులైన గుంటూరు మున్సిపల్ కౌన్సిలువారు సార్వజనిక గ్రంథాలయమును స్థాపించి పోషించుచుండుట ప్రశంసనీయము. వీరిమార్గము నితర స్థానిక సంస్థలును అనుకరించిన బాగుండునని తోచుచున్నది. సహకార సంస్థలును తమ సాముదాయిక ప్రయోజననిధిని గ్రంథాలయముల కొసంగి గ్రంథాలయోద్యమమునకు తోడ్పడవలయును. ఈవిధముగ నెల్ల ప్రజాసంస్థలు తదేక దీక్షతో గ్రంథాలయోద్యమ వ్యాపనమునకు సహకార మొనర్చినగాని గ్రామప్రజలను విజ్ఞానవంతులుగ జేయుటకు తగినన్ని తృప్తికరమైన గ్రంథాలయములు ఈ బీదదేశపు గ్రామములలోను పట్టణములలోను నెలకొనజాలవు, వృద్ధిపొందజాలవు, పోషింపబడనేరవు.

ఈ యుద్యమాభివృద్ధికి సాయపడు విధానము లింక నెన్నియో గలవు. కాని వాని నన్నిటిని సూచించు భారమును సభాప్రారంభకులు వహించుట ఆచారముకాదు. కాన నే నందుకు సాహసింపను. ఇప్పటికే హద్దుమీరితినేమో యని శంకించుచున్నాను. మఱియు అమూల్యమగు గ్రంథాలయోద్యమవిషయముల నేకములు, సహజమగు మృదుమధుర వాక్కులతో మనకు శ్రుతపరచి, మనల నెదుర్కొను సమస్యల వివరముగ చర్చింపనున్న అధ్యక్ష మహాశయుల ఘనోపన్యాసమును వినుటకు మీవలెనే నేనును అత్యంత కుతూహలుడనై యున్నాను. కాన నా యుపన్యాసము నింతటితో ముగించుచు, విసుగుజనింప జేసినను దయామయులై ఓపికతో నావిజ్ఞప్తిని వినిన మీ కనేకవందనము లర్పించుచు, ఈ గుంటూరు మండల గ్రంథాలయ దశమ మహాసభ విజయవంతముగ జరుగునటుల ననుగ్రహింప బరాత్పరుని బ్రార్థించుచు, ఈ మహాసభను పరమానందముతో ప్రారంభించుచున్నాను.

## ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘసభ, విశాఖపట్టణము

(ది 25—11—35 ).

సామాన్యసభ్యుల సమావేశమునందు చేయబడిన తీర్మానములు.

౧ ఆంధ్రదేశ గ్రంథాలయసభలు ఇతరసభలతో అనుబంధముగా చేయకూడదని యీసభవారు తీర్మానించుచున్నారు.

౨ ఆంధ్రదేశ మంతయు గ్రంథాలయ యాత్రలద్వారా గ్రంథాలయోద్యమమును వ్యాపింపచేయ వలసినదని ఈ సభవారు తీర్మానించుచున్నారు. శ్రీవావిలాల గోపాలకృష్ణయ్యగారి నాయకత్వముక్రింద పశ్చిమాంధ్ర జిల్లాలకు సైకిళ్ళమీద గ్రంథాలయ యాత్రను పంపుటకు తీర్మానించడమైనది.

3. (క) ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు తమ ప్రాచ్యబిరుద పరీక్షలలో తెలుగు ప్రధానముగా గలపార్టు 'బి' విద్వాన్ పరీక్షను, ద్రవిడ భాషల పాండిత్యమునకై ఇచ్చుపార్టు సి విద్వాన్ పరీక్షను తీసివేసియును, తెలుగుపాండిత్యమునకై బిరుదు నిచ్చునట్టిపార్టు 'డి' విద్వాన్ పరీక్షను అసలేపెట్టకుండనుచేసి తెనుగుభాషయెడ నిరాదరణ చూపినందులకై ఈసభవారు తమ విచారమును వెల్లడించుచున్నారు.

(చ) ఆంధ్రవిశ్వవిద్యాలయములో నడపబడు ప్రతిప్రాచ్యభాషాపరీక్షకు తెనుగుభాషను కూడ పాఠ్యవిషయముగా నిర్ణయించ వలయునని ఆంధ్ర విశ్వవిద్యాలయమువారిని కోరుచున్నారు.

(ట) తెనుగు భాషా పాండిత్యమును దేశములో విస్తరింపజేయుటకుగాను మదరాసు విశ్వవిద్యాలయముయొక్క ప్రాచ్య భాషాపరీక్షల విద్యాప్రణాళికకు సమాధానముగ పార్టు బి. సి. డి. విద్వాను పరీక్షలను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపక్షమున జరుపుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

(త) సదరు పరీక్షలను అమలులో పెట్టుటకు గావలసిన యావత్తు కార్యక్రమమును ఈ సంఘపక్షమున నిర్వహించుటకును, ఇతరులను చేర్చుకొనుటకును, నియమించుకొనుటకును, అధికారము ఇచ్చుచు అన్నియేర్పాటులుచేసి ఈపని నెరవేర్చుటకు ఈ క్రిందివారిని ఉపసంఘముగ ఏర్పాటుచేయడమైనది.

శ్రీయుత మారేపల్లి రామచంద్రకవిగారు (అధ్యక్షులు)

,, ఉన్నవ లక్ష్మీనారాయణగారు (కార్యదర్శి)

,, మందలపర్తి ఉపేంద్రశర్మగారు (సహాయకార్యదర్శి)

,, త్రిపురనేని రామస్వామిచౌదరిగారు (సభ్యులు)

## ఏలూరు, అన్నదానసమాజము—Annadanasamajam, Ellore.

ఏలూరు, అన్న, వస్త్ర, వైద్య, విద్యాదానసమాజము 1918 సం॥రమున స్థాపింపబడెను. ప్రభుత్వమువారు స్థలము ధర్మముగ నొసంగిరి. మ॥రా॥శ్రీ బొమ్మా రత్నంగారి ద్రవ్యసహాయమున భవనము నిర్మింపబడెను. ఇందు ప్రతిదినము అశక్తులకు అన్నదానము జరుగుచున్నది. ప్రతిసంవత్సరము 15 డిశంబరున బీదలకు వస్త్రదానము జరుగుచున్నది. వేసవికాలమున మంచినీళ్ల చలివేంద్రిలు పెట్టబడుచున్నవి. వైద్యదానము ప్రతిరోజు సాయంకాలము సమాజమువద్ద జరుగుచున్నది.

ఒకరోజు అన్నదానమునకు రు 60 లు ధర్మమిచ్చిన స్థిరాస్తివల్ల వచ్చేఆదాతో వారు కోరిన తేదీ 1 రోజున బీదలకు అన్నదానము జరుగును. వస్త్రదానము శాశ్వతనిధి ధర్మము రు 10 లు లగాయతు ఈయవచ్చును. ధర్మములకు రశీదులును, శాశ్వతనిధి ధర్మములకు రసీదులతోసహా పట్టాలను 5 గురు శాశ్వతధర్మకర్తలు (రు 500 దాతలు) సంతకములతో నిచ్చెదరు. ఎల్లరు సహాయపడ గోరుచున్నాము. ఇతర వివరములకు:—

| | |
|---|---|
| రావుబహద్దరు, మోతే గంగరాజు జమీందారుగారు | శాశ్వతధర్మకర్తలలోనివారు |
| కొత్తమాసు సీతారామయ్యగారు, (పోల్ ట్రిస్టీలు) | |
| పసుమర్తి పురుషోత్తంగారు, (ప్రెసిడెంటు) | |
| మద్దుల వెంకట చినరాజుగారు, (వైస్‌ప్రెసిడెంటు) | |
| నున్నా గంగరాజుగారు, (వైస్‌ప్రెసిడెంటు) | |
| కంచుల రామయ్యగారు, (సెక్రెటరీ) | |

---

## ఏలూరు, హిందూ యువజనసంఘము

### Youngmen's Hindu Association, Ellore.

ఈ గ్రంథాలయము 1904 సం॥రము స్థాపించబడెను. 1918 సం॥రము॥ సంఘము రిజిష్టరు అయినది. 1928 సం॥రము మ॥రా॥శ్రీ రా॥బ॥ మోతే గంగరాజు జమీందారుగారి ద్రవ్యసహాయమున నూతన దివ్యభవనము (రు 50,000 లు వెచ్చింపబడి) నిర్మింపబడినది. ఇందు దిన, వార, పక్ష, మాసపత్రికలు, ఆంగ్ల, ఆంధ్రభాషలయందు వచ్చుచున్నవి. ఆంగ్ల, ఆంధ్ర, సంస్కృత గ్రంథములు సుమారు 18 వేలవరకు గలవు. మ్యాజిక్‌లాంతరు, వ్యాసరచన, పోటీపరీక్షలు, విషయనిర్ధారణ సభలు, వక్తృత్వపోటీపరీక్షలు ప్రతిసంవత్సరము జరుపుచు అందు త్తీర్ణులకు బహుమతులొసంగబడుచున్నవి. ఇంకను గ్రంథములు, పత్రికలు, తెప్పించవలసి యున్నది. ఎలక్ట్రిసిటి, రేడియో అవసరము. ప్రతి సంవత్సరము ఆదాయమునకు మించిన వ్యయము మగుచున్నది. కాన ఎల్లరు శక్తికొలది సహాయపడుడు. ధర్మములకు రశీదులను శాశ్వత ధర్మములకు రశీదులతో పాటుపట్టాలను, 5 గురు శాశ్వతధర్మకర్తల (రు 500 దాతలు) సంతకములతో నిచ్చెదరు. క్యాటలాగులు అచ్చువేయబడెను. బజారులో బ్రాంచి లైబ్రరీ కూడ కలదు. ఇతర వివరములకు—

రావుబహద్దరు, మోతే గంగరాజు జమీందారుగారు, (ధర్మకర్తృసభాధ్యక్షులు)
మద్దుల వెంకట చినరాజు శ్రేష్ఠిగారు, (ధర్మకర్తృసభాగౌరవకార్యదర్శి)

# హిందూ యువజనసంఘము అన్న, వస్త్ర, వైద్య, విద్యాదాన సమాజము, గోసంరక్షణసమితి (ఏలూరు.)

ధర్మకార్యముల శాశ్వతసభ్యుల తరగతులు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| (1) శాశ్వత ధర్మకర్తలు | 500 | (4) శాశ్వత అభిమానులు | 150 | (7) రు 3 ల శాశ్వత సభ్యులు | 35 |
| (2) శాశ్వత పోషకులు | 250 | (5) రు 1 ల శాశ్వత సభ్యులు | 100 | (8) రు 4 ల శాశ్వత సభ్యులు | 20 |
| (3) శాశ్వత సహాయులు | 180 | (6) రు 2 ల శాశ్వతసభ్యులు | 68 | (9) రు 5 ల శాశ్వత సభ్యులు | 10 |

ఆదానుబట్టి ధర్మములు జరుగుటకు పైన తెలిపినప్రకారం శాశ్వతనిధికి ధర్మంయిచ్చి క్రమేణా హెచ్చుతరగతులుగా శాలాదాలకు చేరవచ్చును. ఇట్టిధర్మములకు రశీదులును యివ్వబడును. ప్రత్యేక పట్టాలనుకూడా అయిదుగురకు తక్కువకాని శాశ్వత ధర్మకర్తల సంతకములతో యిచ్చెదరు. శాశ్వతధర్మకర్తలకు వారు యిచ్చు ఛాయాపటము (Oil painting or enlargement) కార్యస్థానమున అలంకరించెదరు. వారు ఫోటోబ్లాకులు (Half tone block) యిచ్చిన సంవత్సర రిపోర్టులలో ముద్రించెదరు. ఎల్లరు యథాశక్తిని సహాయముచేసి, పుణ్యము సంపాదించ గోరెదను.

శాశ్వత ధర్మకర్త:—మద్దుల వేంకట చినరాజు శ్రేష్ఠి.

ఉపాధ్యక్షులు అన్నదాన సమాజము, ఉపాధ్యక్షులు గోసంరక్షణ సమితి,
గౌరవకార్యదర్శి, ట్రస్టుబోర్డు, హిందూయువజన సంఘము.



# Gosamrakshana Samithi, Ellore.

# గోసంరక్షణ సమితి, ఏలూరు,



ఈ సమితియందు దిక్కులేని గోవులు రక్షింపబడును. పాలు ఉన్నయెడల చంటి బిడ్డలకు దైవపూజలకు, బీదలకు ఉచితముగ నిచ్చెదరు. పచ్చగడ్డి నిమిత్తము బీడుభూమి కావలసియున్నది. మంచిస్థితిలోనికి వచ్చిన గోవులను గృహస్థులకు అమ్మెదరు. గోశాలనిమిత్తము స్థిరమైన స్థలము అవసరము. ధర్మములకు రశీదులు శాశ్వతనిధి ధర్మములకు రశీదులతోసహా అయిదుగురకు తక్కువగాని శాశ్వత ధర్మకర్తలు [రు 500 దాతలు] సంతకములతో పట్టాల నిచ్చెదరు. అభిమానులెల్లరు శక్తికొలది శాశ్వతనిధిధర్మము లేకాక వార్షిక మామూళ్లను, నెల చందాలుగను, పచ్చిగడ్డి, తవుడు, విరాళములుగను సహాయపడి యీ సమితియభివృద్ధికి తోడ్పడ గోరుచున్నాము.

గోసంరక్షణసమితి ప్రచురణములకు, రూల్సుబుక్కులకు, రిపోర్టులు మున్నగువానికి:—

5—1—1935. } రా॥ బ॥ మోతే గంగరాజు జమీందారుగారు, (ప్రెసిడెంటు, ట్రస్టి.)
మద్దుల వెంకట చినరాజు శ్రేష్ఠిగారు, (వైస్ ప్రెసిడెంటు, ట్రస్టి.)

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు కుందా లక్ష్మీనరసయ్యగారిచే ముద్రింపబడినది.